శ్రీ ర స్తు.

# శ్రీమంగళాద్రి నృసింహస్వామి వారి స్తోత్రం.

ఇది

వింజమూరి వీరరాఘవాచార్యులగారిచే రచియింపబడి

వారిచేతనే పరిష్కరింపఁబడి

ఆర్యవైశ్య ముద్రాక్షరశాలలో

శ్రీయుత శనగపల్లి శ్రీరామమూర్తి గుప్తగారిచే

ముద్రింపబడి.

శ్రీయుత శనగపల్లి వరదరాజస్వామి గుప్తగారిచే.

ప్రచురింపబడియె.

గుంటూరు.

[illegible] ౧౯౨౩ రు 0-0-6

శ్రీమతే రామానుజాయనమః.

శ్రీమంగళాద్రి నృసింహస్వామివారి స్తోత్రం



తే॥ గీ॥ గురువరుఁదలంచి మ్రొక్కి సద్గురులఁగొలిచి
శ్రీయతీంద్రుని యామునదోయజాక్షు
నాధుశఠవైరి సైన్యధినాధుగొల్చి
లక్ష్మినారాయణుల స్తుతులంభనసింతు॥ ౧

తే॥ గీ॥ హరియునే దేవి భ్రూక్షేపహర్షములను
గాంచిసృష్ట్యాది లీలలగడపుచుండు
నట్టినిత్యానపాయినియై వసించు
పద్మనిలయనులక్ష్మిని బ్రస్తుతింతు॥ ౨

తే॥ గీ॥ తనహారిత్వంబు ప్రజలకుదగగజూప
నృహరిరూపంబుదాల్చుచు నిబుబుతీంద్రు
తననఖాగ్రంబులను బీరుదానవారి
పద్మనిలయాపతిని నాత్మబరిస్తుతింతు 3

తే॥ గీ॥ జగములన్నియుఁదనయందు జంచలింప
జగము లేతన కాధారమగుటజూపి
విశ్వపతియంచు వేదముల్ వినుతిసేయ
దగినపానకనరసింహుఁ దలతునాత్మ। ౪

తే॥ గీ॥ ప్రకటరోమపళింబునఁ బ్రబలదైత్యు
నముచినివధించి తద్రోమశమనముసకొ
నాఁగగుడత్రోయ మెప్పుదునానెడీవు
నృహరిరూప ధరాదేవనృపరి పాఁ

ఆ॥ వె॥ ఆత్మ చక్రనేను నావిర్భవించియు
భక్తజనులనార్తిఁ బారదోలి
తనదుకరుణజనులు మనమునెఱుగంగ
నృహరిదేవుఁగొలుతు నెమ్మమున॥ [illegible]

ఆ॥ వె॥ దాసజనులదోషతతిని భోగ్యముగాఁగఁ
గైకొనియెదననుచు గలజనులకుఁ
బలుకురీతి తుర్యవర్ణజనుల్ సేయు
పానకంబుఁగ్రోలు పరమపురుష॥ ౨

ఆ॥ వె॥ మొసలివాతబడుచు మొఱవిడుగజమును
రక్షణంబుసేయఁ బక్షివాహ
తత్క్షణంబవచ్చి తగగరక్షించిన
నారసింహదేవ నన్నుగావు॥ ౧ ]

ఆ॥ వె॥ నాథనీదుపాద నలినంబులందున
భక్తిఁ గలుగనిమ్ము పద్మనేత్ర
మంగళాద్రిదేవ మహితపాననృసింహ
నీదుమూర్తిఁ జూపు నెమ్మిదేవ॥

కం॥ కౌతుకముడఁగూర్పఁ శ్రీ
పతి, ఖంపగుతోడకంబు బాగుగఁ బ్రజన
మ్మతిఁ జూడగఁ గ్రోలుచునగ
మతిదయచేదాసులకిను హరినాకపుడు॥ ౧౦

కం॥ శేషముదాసులకిచ్చెడు
వేషంబదిగాకసగను విడువగవలెనే?
తోషముమంగళగిరిహరి
వేషముగలదేవదేవ వేడెదనిన్నున్॥ ౧౧

ఉ॥ సంగరరంగమందు రిపుజాలము నోర్చిన చాపమొప్పఁగా నీ
యంగములందుఁ గ్గ యనవార్ద్రసుచందనలేపముం దగా
సింగపుమేల్పు భద్రగిరిఁ జేరి నదీజలమెప్పుచూచెదా
మంగళశైలవాసగుణమర్దిత తోయముద్రాపదాపహారీ॥ ౧౨

ఉ॥ పాపములెల్ల బాపఁ ముని- భావములుల్లసిలంగ జేయ, సం
తాపముఁ జేయు దానవుల- దర్పమడంప, నివాసమందితో
రూపునమౌనిరక్షణకు- రూఢిగదత్తవటద్రుమాళికిన్
దాపునమంగళాద్రితటి- తావున నిల్చియాడెదవు హారీ॥ ౧౩

మ॥ అలఁగారీశ విరించి వజ్రిముఖ దేవాళుల్మునుల్ సిద్ధులున్
జలజాతాక్ష నినుం భజింపగని విస్తారస్తుతుల్ జేసిరే
నిల నిన్నెట్లు నుతింతునంచు నక నేనున్ స్తోత్రముం జేసెదన్
లలితంబంచు దలంచి గైకొనుటకై లక్ష్మీశ కేల్మోడ్చెదన్॥ ౧౪

శా॥ తాపింఛద్రుమకోరకాకృతి జనత్రాసార్తి సంహారుడున్
దాపత్రయ్యాధి వేడితాత్మ జగత్త్రాణుండు త్రైవిక్రమా
ఖ్యాపాస్త ప్రబలారిజాతు డఖిలవ్యాప్తుండు శ్రీమంగళా
ద్రి ప్రాశస్త్యగిరీశుడా నృహరి సద్దేవుండు బ్రోచుఁ గృపన్॥ ౧౫

తే॥ గీ॥ పక్షిపతియును మర్కట పతియు నీదు
పాదయుగమని తద్ధర్మ మూదనేమొ
నీవు నఖరాయుధుండవై నెగడితిలను
నరమృగేంద్రాకృతి వహించి నలిననాభ॥ ౧౬

కం॥ కృతయుగమున నమృతంబును
గతత్రేతను నాజ్యమవతికాలమునందున్
వితతంబుగ క్షీరంబును
కడ పానకము గలిని మరిగితి॥ ౧౭

తే॥ గీ॥ సీతమహిమను వర్ణింప నిర్ణయించి
హర విరించి ముఖామరు లాది తుదలు
గనగ నెరర వేదముల్ గాంచి వెదకి
గానలేకను మరలెను కంజనేత్ర॥ ౧౮

కం॥ నిష్కర్ము లెల్ల సీతా
విష్కారణంబునను జేసి వెలయుదురు మునుల్
నిష్కారణంబ గతికి బ
హిష్కారము బొందుదుర్ ప్రవృత్తిపరులిల॥ ౧౯

తే॥ గీ॥ కృతయుగంబునః గిరిరాజుః గృపను బ్రోచి
త్రేతను విభీషణుని బ్రోచి త్రికరణముల
ద్వాపరంబున బ్రోచితో ద్రౌపదిసతి
కలిః యుగంబున బ్రోతువు భక్తుల హరీ॥ ౨౦

కం॥ నీవు ప్రసన్నుడవై నను
రావు భయంబులు స్వదోషరాసులవలనన్
పోవు భయంబులు భవులకు
నీవిల సత్ప్రేమశోక నృహరి మురారీ॥ ౧౧

తే॥ గీ॥ స్వామి నన్విడవాడకు సకలదోష
సయుతుడంచును మదలోభ శాశ్వతుడని
నిఖిలసుగుణనిధియని నెనరుమాని
వీడు మనవాడయని బ్రోవు వేడ్క-మీర॥ ౧౨

తే॥ గీ॥ నన్నె యవనేల నీకాంతినై జనుగద
దోసమున్నను నుండనీ దోషమేమి
సేయు మనలను వనవె మున్స్రీనివాస
తోషభోగ్యుండవందురు దొరలునిన్ను॥ ౧౩

కం॥ కాకాసురు రక్షించిన
నీకును రోషంబుగలదె నిజజనులయెడన్
ప్రాకటశాంతగుణుండవు
నాకలుషములెల్ల బాపు నరహరిదేవా। ౧౪

తే॥ గీ॥ మంగళాద్రి నృసింహ నామానసంబు
నిర్భరంబయి నీదెస నిలిచెగాన
దైత్యసూనుని రక్షించు దయదలిర్ప
నన్ను రక్షింపుమోదేవ నయమువీర। ౧౫

తే॥ గీ॥ నీనివాసంబు యోగుల నిమ్మనముల
మంగళాద్రిగుహామధ్య మరిగి దేవ
అలయశోదస్తన్యంబులు నలరుమధుర
మానగుడతోయ మందానమానవీవు॥ ౧౬

ఆ॥ గీ॥ ప్రహస్వశృంగుని మంగళాచార్యవరుని
జేసి తన్మానసంబు నివాసముగను
జేయదలచి గుహాంతర సీమనుండు
పానకనృసింహ దేవ మాంపాహిపాహి॥ ౨౭

కం॥ శ్రీశాద్రియు ముక్త్యాద్రియు
నీతంబుగ ధర్మశైలనేరముచుచు స
ద్వ్రాతంబు బలుకజేసియు
ఖ్యాతిని గలిగించితౌర కలికిన్నృసింహా॥ ౨౮

తే॥ గీ॥ మంగళాద్రియటంచును మహిమగల్గు
పర్వతంబు గనంజాలు ప్రజలకెల్ల
భుక్తిముక్తులు గలిగించు భోగనార
సింహదేవ ననుంగావు సిద్ధముగను। ౨౯

తే॥ గీ॥ నీకు శుభమగుగాకంచు నెమ్మిబలుక
నెంచెద మదీయదోషముల్ హెచ్చరింప
బలికెద శుభంబునీకు నోపరమపురుష
విష్ణుచిత్తార్యవాక్యము ల్విస్తరించి॥ ౩౦



# ప్రకటన.



మా ముద్రాక్షరశాల యందు వెలకు దొరుకు పుస్తకములు

1 ఊర్ధ్వపుండ్రవిధి

2 ధాటీపంచకము

3 వీరనారాయణ ముకుందశతకము

4 దక్షిణోత్తర గోత్రగ్రహణము - ఇది బ్రహ్మశ్రీ గుండూరు వెంకట శివకవి విరచితము

5 మహాకవి కాళిదాసనాటకము ఇది బ్రహ్మశ్రీ నారపరాజు లక్ష్మీకాంతకవి విరచితము 0-8-0

6 దివ్యదృష్టి.

7 గోదాకళ్యాణము హరికథారూపము (శ్రీ ఆండాళ్లమ్మగారి చరితము)

